

మధురం మధురేభ్యోఽపి
మంగలే భ్యోఽపి మంగలమ్
పావనం పావనేభ్యోఽపి
హరే ర్నామైవ కేవలమ్

**Sweeter than sweet things, more auspicious than all the auspicious things, more sacred than all the sacred things is the name of Hari, Hari alone.**

స్వామి సుందర చైతన్యానంద

# భజనావళి



స్వామి సుందర చైతన్యానంద

# భజనావళి



సుందర చైతన్యాశ్రమం

ధవళేశ్వరం - 533 125



## నివేదన

"నన్నెందుకిలా బాధిస్తావు? నీ కర్కశ హస్తాలతో నలిపి నన్నెందుకిలా వేధిస్తావు ? నాకూ అవకాశమొచ్చే రోజొకటుంది, ఆనాడు నిన్ను నాలో బంధించి నా పగ తీర్చుకుంటాను" అని మట్టి కలుపుతున్న కుమ్మరితో మట్టి చెప్పిందంటారు భక్త కబీర్‌దాస్. నిజమే కదూ! ఎంత కాలం జీవించినా ఎన్ని భోగాలనుభవించినా జన్మంటూ వచ్చింది గనుక ఒకనాడు మృత్యువును ఆలింగనం చేసుకోక తప్పదు. భయంకర మృత్యువాత పడి చావు పుట్టుకల విషవలయంలో చిక్కక తరించువాడే ముక్తపురుషుడు. అట్టి ప్రయత్నము చేయువాడే మానవుడు.

అమృత స్వరూపుడైన భగవంతుని చేరితేనేగాని మానవునికి జన్మసంప్రాప్తమైన అనంత దుఃఖము తీరదు. అట్టి మోక్షప్రాప్తికి కర్మ, భక్తి, జ్ఞాన యోగ మార్గములనేకము లున్నవి. కానీ పెట్రోలు అయిపోయేలోగా గమ్యము చేరువాహనమే మనకు ఆనందము నొసగేది.

రెక్కలులేని పక్షి గాలిలో విహరించలేదు. రెక్కలున్నప్పటికి తోకలేని పక్షి ఎగురలేదు. పక్షి గాలిలో నిరపాయముగా సంచరించుటకు, క్రింద పడకుండా తేలియుండుటకు తోక సహకరిస్తుంది. కర్మ, జ్ఞాన మనునవి పక్షికి రెక్కలయితే భక్తి తోకలాంటిది. భక్తిలేని కర్మజ్ఞానములు అహంకారానికి, అజ్ఞానానికి ప్రతిరూపాలై పతనావస్థకు దారితీస్తాయి. భక్తి మానవ హృదయమును దేవాలయముగ మార్చి లక్ష్యసాధనకు పురికొల్పుతుంది. పవిత్రమైన అట్టి పరాభక్తి చివరకు జ్ఞానముగా పరిణమిస్తుంది. అందుచేత భక్తియే శ్రేష్ఠమైనది. సులభమైనది. నిరపాయమైనది. సున్నితమైనది.

"అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ"

అని నారదమహర్షి భక్తి సూత్రాలలో తెలియ చేశారు.

"నాహం వసామి వైకుంఠే
యోగినాం హృదయేనచ
మద్భక్తా యత్ర గాయంతి
తత్ర తిష్ఠామి నారద"

"నారదా! నేను వైకుంఠములో లేను. యోగుల హృదయములలో కనబడను. నా భక్తులు ఎచ్చటయితే నన్ను గూర్చి గానం చేయుచున్నారో నే నచ్చటే యున్నాను" అని పద్మ పురాణంలో భగవానుడు నారద మహర్షికి తెలియజేశాడు.

"కలౌ కేశవ కీర్తనాత్"

కలియుగమునందు నామసంకీర్తనకు మించిన సులభ సాధన లేదంటూ శాస్త్రములు ఘోషిస్తున్నాయి. మహాత్ములు ప్రవచిస్తున్నారు.

అనారోగ్యాన్ని పోగొట్టి ఆరోగ్యాన్ని ప్రసాదించేందుకు వైద్యుడు రోగికి మందిస్తాడు: ఆ మందు వివరాలు, తయారుచేసిన ప్రక్రియ రోగికి అనవసరం. రోగం నయం కావడమే రోగికి కావాలి. అలాగే మానవుడు

తరించేందుకు సంకీర్తనామృతాన్ని ఔషధంగా ఇచ్చాడు భగవంతుడు. దాని వివరాలను విమర్శించుకుంటూ కాలాన్ని వృధాచేసుకొని కాష్టానికి ఆహుతి కావడంకన్నా విశ్వసించి, ఆచరించి, తరించడమే మానవ కర్తవ్యము.

గతంలో పన్రెండుసార్లు ఈ గ్రంథమును ముద్రించడం జరిగింది. ఆ గ్రంథాలు భక్తులచేత విరివిగా ఆకర్షించబడి మచ్చుకు ఒక కాపీ కూడా లేకుండా పోయాయి. భక్తుల అభిలాష మేరకు ఈ గ్రంథమును మళ్ళీ ముద్రించుచున్నాము.

భక్తులారా! భగవంతుని బిడ్డలారా! వాసుదేవ కుటుంబ సభ్యులారా! పవిత్రమైన నామ సంకీర్తనామృతాన్ని జుర్రండి. పానం చేయండి. తరించండి. తరింప చేయండి.

జై జై వాసుదేవహరి

ప్రణవ ప్రేమలతో
భగవత్సేవలో
మీ
స్వామి సుందర చైతన్యానంద

మధురం మధురేఽభ్యోపి
మంగలే భ్యోఽపి మంగలమ్
పావనం పావనేఽభ్యోపి
హరే ర్నామైవ కేవలమ్॥

మధురమైన వాటి కన్నను మధురమైనది,
శుభకరమగు వాటికన్నను శుభకరమైనది,
పవిత్రమగు వాటికన్నను పవిత్రమైనది
శ్రీ హరి నామమే.
శ్రీ హరియే.

Sweeter than sweet things,
more auspicious than
all auspicious things,
more sacred than all the
sacred things is the name of
Hari, Hari alone.

యజ్ఞేశాచ్యుత గోవింద
మాధవానంత కేశవ
కృష్ణ విష్ణో హృషీకేశ
వాసుదేవ నమోస్తుతే



# నల్లనయ్య

పుంజీభూతం ప్రేమ గోపాంగనానాం
మూర్తీభూతం భాగధేయం యదూనాం
ఏకీభూతం గుప్త విత్తం శ్రుతీనాం
శ్యామీ భూతం బ్రహ్మమే సన్నిధానం

బృందావనం గోపభామల సామూహిక ప్రేమ మూట. సుందర రూపములో గోచరించే యాదవుల అదృష్టబాట. గుప్తమైన వేద భాండాగారము ఏక రూపంలో తీర్చిన ఊట. శ్యామవర్ణ కాంతిలో అగుపించే బ్రహ్మ ఆట–నానల్లనయ్య – నాతండ్రి కృష్ణయ్య సదా నా కళ్ళముందు ప్రసన్నుడై యుండు గాక!